

# ఎంబెరుమానార్ హెచ్చరికలు



శ్రీపెరుంబూదూరు దివ్యదేశంలో భగవద్రామానుజుల సంవత్సర ఉత్సవం–లోనూ, గురుపుష్యమి ఉత్సవంలోనూ, ఇంకా, విశేష శాత్తుముఱై సందర్భాలలోనూ, రాత్రి వారు కణ్ణాడి గది (అద్దాల గది) నుండి ఆస్థానానికి వేంచేసే సమయంలో అనుసంధించే హెచ్చరికలు. ఈ చిరు గ్రంథం అంతర్జాల మాధ్యమంలో లభించిన తమిళ గ్రంథాన్ని ఆధారంగా చేసికొని అనువాదం చేయబడింది.


**అనువాదకులు:**

'పండిత రత్న' డా॥ ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి అళ్వార్ శింగరాచార్యులు

**సంపాదకుడు:** ఈయుణ్ణి అనంత రంగ రామన్



ప్లవనామ సంవత్సర గురుపుష్యమి – 19–01–2022

## ధ్వజస్తంభం దగ్గర, తిరుమడప్పళ్ళి (వంటశాల) దగ్గరగా వేంచేసేటప్పుడు:

**1) చార్వాక గర్వ నిర్వాపణ దూర్వహా! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(చార్వాకుల గర్వాన్ని లేకుండా చేయడంలో సమర్థులైన స్వామీ!, హెచ్చరిక!)

**2) మృషామత విషాటవీదవహుతవహా! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(మాయావాదమనే విషపూరితమైన అరణ్యాన్ని దహించే అగ్నివంటి స్వామీ!, హెచ్చరిక!)



**3) బౌద్ధధ్వాంత విధ్వంసన వికర్తన! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(బౌద్ధమతమనే చీకటిని నశింపజేసే సూర్యునివంటి స్వామీ!, హెచ్చరిక!)

**4) మధ్వమత విధ్వంసక! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(మధ్వమతాన్ని ఓడించే స్వామీ!, హెచ్చరిక!)

**5) శంకరాదికుమతి ఘూక భయంకర దివాకర! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(శంకరమతం మొదలైన కుమతాలను వాదించే గుడ్లగూబల వంటివారికి భయాన్ని కలిగించే స్వామీ, హెచ్చరిక!)

**6) భవ భయాభితప్తజనభాగధేయ వైభవ భావితావతరణ! హెచ్చరికై! స్వామి! హెచ్చరికై!**

(సంసారమనే భయంచేత మిక్కిలిగా తపింపబడ్డ సంసారులు చేసికొన్న పుణ్యవైభవంగా భావింపబడే అవతారాన్ని కలిగిన స్వామీ!, హెచ్చరిక!)

## పడియేత్త సేవకు(మెట్లు అధిరోహించుట) తరువాత, బంగారు మండపం దగ్గరగ సన్నిధిని వైపు వీక్షిస్తూ తిరిగేటప్పుడు:



**7) ఉభయ విభూతి సామ్రాజ్య పట్టాభిషేకలక్ష్మీ సంపన్న! హెచ్చరికై!**

(ఉభయవిభూతులనే సామ్రాజ్యంలో పట్టాభిషేకం చేయబడినందున ఏర్పడిన వైభవాన్ని కలిగిన స్వామీ!, హెచ్చరిక!)

## శ్రీ రామానుజులు తమ భక్తులకు ముదలియాండాన్ అనుగ్రహించే సమయంలో,

## నంబిళ్ళైసన్నిధిలో:



**8) నంబిళ్ళై ఇన్నముఱ నాన్మఱైనూల్ విరిత్త దేవా! హెచ్చరికై! స్వామి! హెచ్చరికై!**

(నంబిళ్ళై ఆనందించేటట్లు నాలుగు వేదాలను వివరించిన దేవా!, హెచ్చరిక!)

## శ్రీవేదాంతాచార్యుల సన్నిధిలో:

**9) మాయావాది హృదయబాధావహా! హెచ్చరికై! స్వామి! హెచ్చరికై!**

(మాయావాదుల హృదయానికి బాధకలిగించే స్వామీ! హెచ్చరిక!)





**10) అఖిల జగద్ధితానుశాసన ప్రవృత్త శ్రుతి నికర శిఖరాంతర్జ్వరాభిషగ్వరా! హెచ్చరికై! స్వామి! హెచ్చరికై!**

(సమస్త జగత్తుకూ హితాన్ని బోధించడంకోసం ప్రవర్తించిన వేదాంతాల మనస్సులలో ఏర్పడిన జ్వరాన్ని తీర్చిన వైద్యునివంటి స్వామీ!, హెచ్చరిక!)

## నమ్మాళ్వారుల సన్నిధిలో:

**11) పూమన్ను మాదు పొరుందియ మార్బన్ పుకఴ్ మలింద పామన్నుమాఱనడిపణిందుయ్ న్ద దేవా! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(లక్ష్మీదేవిని వక్షఃస్థలంలో నిత్యంగా కలిగిన భగవానుని వైభవం నిండుగా కలిగిన పాశురాలను అనుగ్రహించిన నమ్మాళ్వారుల శ్రీచరణాలను ఆశ్రయించి తరించిన దేవా!, హెచ్చరిక!)

**12) శ్రీమాధవాంఘ్రిజలజద్వయనిత్యసేవా ప్రేమావిలాశయ పరాంకుశపాదభక్త హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(శ్రీమన్నారాయణుని శ్రీచరణాలలో కలిగిన అంతులేని భక్తిచేత ఆ స్వామికి నిత్యం సేవచేయాలనే భావాన్ని కలిగిన నమ్మాళ్వారుల శ్రీచరణాలలో భక్తిని కలిగిన స్వామీ!, హెచ్చరిక!)



**13) శ్రీమత్ పరాంకుశపదాంబుజమత్తభృంగాయితాంతరంగ! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(శ్రీనమ్మాళ్వారుల శ్రీచరణాలనే పద్మాలలో ఆసక్తిని కలిగిన ఆనందించిన తుమ్మెదవంటి మనస్సు కలిగిన స్వామీ!, హెచ్చరిక!)

## శ్రీ నమ్మాళ్వారుల మంగళాశాసనం పూర్తి అయి తిరిగి వచ్చేటప్పుడు:

**14) అనైత్తులకుముడైయ అరవింద లోచనా! హెచ్చరికై! స్వామి! హెచ్చరికై!**

(సమస్తజగత్తును స్వాధీనంలో కలిగిన తామరపూలవంటి నేత్రాలను కలిగిన స్వామీ!, హెచ్చరిక!)

**15) వాదిమత్తేభ కంఠీరవ హెచ్చరికై! స్వామి!హెచ్చరికై !**

(మదించిన ఏనుగులవంటి ప్రతివాదులను ఓడించే సింహంవంటి స్వామీ!, హెచ్చరిక!)

## ఆండాళ్ సన్నిధిలో:

**16) శ్రీమత్ గోదాగ్రజాభిధానా! హెచ్చరికై! స్వామి! హెచ్చరికై!**

('గోదాదేవికి అన్న' అని పిలువబడేస్వామీ!, హెచ్చరిక!)



**17) తిరుప్పావై జీయర్ఎన్ఱు విరుప్పాల్ ఉరైత్త దేవా! హెచ్చరికై! స్వామి! హెచ్చరికై!**

('తిరుప్పావై జీయర్' అని గౌరవంగా పిలువబడే స్వామీ!, హెచ్చరిక!)

**18) అరంగర్ మౌళి శూఙ్ద కిన్దమాలైయై చ్చూడిక్కొడుత్త శురుంబార్ కుழల్ కోదై "నమ్ కోయిల్ అణ్ణర్" ఎన్ఱు దేవా! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(తాను తలలో అలంకరించుకున్న పూమాలను శ్రీరంగనాథునకు సమర్పించిన గోదాదేవి 'కోయిల్ అణ్ణా' అని పిలిచిన స్వామీ!, హెచ్చరిక!)

**19) శ్రీమన్నందనందన సుందరీసోదరీ భావ భావితా! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(శ్రీనందనందనుని సుందరి అయిన గోదాదేవిచే సోదరభావంతో భావింపబడిన స్వామీ!, హెచ్చరిక!)

## ఆండాళ్ సన్నిధినుండి తిరిగి బయలుదేరే చోట:

**20) మున్నిలుమ్ పిన్నழకియ దేవా! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(ముందుభాగంలో కంటే వెనుకభాగంలో ఎక్కువ అందాన్ని కలిగిన స్వామీ!, హెచ్చరిక!)

**21) శ్రీమద్విశిష్టాద్వైత సిద్ధాంత నిర్ధారణ బద్ధ కౌతుక! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(శ్రీవిశిష్టాద్వైతసిద్ధాంతాన్ని నిర్ణయించడంలో ఆసక్తిని కలిగిన స్వామీ!, హెచ్చరిక!)

## శ్రీ మణవాళ మహాముని శ్రీ భాష్యం అనుగ్రహించిన చోట:

**22) శ్రీమద్భాష్యకార! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(శ్రీమద్భాష్యకారా!, స్వామీ!, హెచ్చరిక!)



**23) శ్రీ భగవద్రామానుజార్యవర్య! హెచ్చరికై! స్వామి! హెచ్చరికై!**

(శ్రీ భగవద్రామానుజార్యవర్యా!, హెచ్చరిక!)

**24) శ్రీమల్లక్ష్మణ యోగి సార్వభౌమ! హెచ్చరికై! స్వామి! హెచ్చరికై!**

(శ్రీమల్లక్ష్మణ యోగి సార్వభౌమా!, హెచ్చరిక!)

## పెరుమాళ్ స్వామి సన్నిధిలో:

**25) సంతత సాక్షాత్కృతగంభీరాంభః సముద్భూత రవి కర వికసిత పుండరీకదళామలాయతేక్షణ! హెచ్చరికై! స్వామి! హెచ్చరికై!**

(నిండయిన నీటిలో పుట్టి, సూర్యుని కిరణాలతో వికసించిన తామర పువ్వుల రేకులవంటి విశాలమైన భగవంతుని నేత్రాలను ఎల్లప్పుడు మనసులో దర్శించే స్వామీ!, హెచ్చరిక!)



**26) అత్తి గిరి అరుళాళ్ అత్తాణి చ్చేవకత్తాల్ పెరుందేవియారుడైయ పెరుమ్ దాహమ్ తీర్తత్త దేవా! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(కంచి వరదరాజ స్వామికి తీర్థ కైంకర్యాన్ని చేయడం ద్వారా పెరుందేవితాయారు యొక్క దాహాన్ని తీర్చిన స్వామీ!, హెచ్చరిక!)

**27) అరుళాళర ఆఱు వార్తై అరుమ్ పొరుళాల్ మత్తై విరిత్తు ప్పెరుమ్ పుకఝ్ కళ్ పడైత్త దేవా! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(వరదరాజస్వామి అనుగ్రహించిన ఆఱు వార్తలను అనుసరించి వేదార్థాన్ని విశదీకరించిన గొప్ప కీర్తిని కల స్వామీ!, హెచ్చరిక!)

## <u>పెరుమాళ్ సన్నిధి నుండి తిరిగి వచ్చేటప్పుడు:</u>

**28) శ్రీమద్యతిసార్వభౌమా! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(శ్రీ యతిసార్వభౌమా!, స్వామీ!, హెచ్చరిక!)

## తిరుక్కచ్చినంబి సన్నిధిలో:

**29) పంచాచార్యపదాశ్రయా! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(ఐదుగురు ఆచార్యులను ఆశ్రయించిన స్వామీ!, హెచ్చరిక!)




**30) తిరుక్కచ్చినంబి అన్బుప్పెరుక్కచ్చెయ్ దుకంద దేవా! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(తిరుకచ్చినంబికి మీ విషయంలో ప్రేమ కలిగేటట్లు చేసి, ఆనందించిన స్వామీ!, హెచ్చరిక!)

**31) శ్రీమత్కాంచీపూర్ణసూరి పూర్ణాభిమాన పాత్ర భూత! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(తిరుకచ్చినంబి అభిమానానికి పూర్తిగా నోచుకున్న స్వామీ!, హెచ్చరిక!)

## శ్రీ ఆళవందార్ సన్నిధిలో:

**32) యతికట్కిఱైవన్ యమునైత్తుఱైవన్ ఇణై యడియామ్ కతి పెట్రవర్ క్కు "నామ్ ఏకలవ్యన్" ఎన్ఱ దేవా! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

("యతులకు ప్రభువైన శ్రీయామునుల పాదాలను ఆశ్రయించినవారికి నేను ఏకలవ్య శిష్యుడను" అని పలికిన స్వామీ!, హెచ్చరిక!)



**33) "ఎమ్బెరుమానారే! వారుమ్" ఎన్ఱు నంబి ఉకందణైత్త దేవా! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

("ఎమ్బెరుమానారే! రండి" అని తిరుక్కోట్టియూర్ నంబి ఆనందంతో ఆలింగనం చేసుకున్న స్వామీ!, హెచ్చరిక!)

**34) మడంగినిన్ఱల యామునర్ తమ్ మూవిరలుమ్ నిమిర్ త్తు ముక్కుఱైయుమ్ నీక్కి ముమ్మఱై విళక్కి ముక్కుఱుంబరుత్తు ముక్కోల్ ధరిత్తు మూవులకుమ్ ఏఱ్ఱ నిన్ఱ దేవా! హెచ్చరిక్కై! స్వామి! హెచ్చరిక్కై!**

(మణగి ఉండే శ్రీయామునుల మూడు వేళ్ళను సరి చేసి, వారి మనసులో ఉండే మూడు కోరికలను తీర్చి, వేదార్థాన్ని విశదీకరించి, దానికి కలిగిన దోషాన్ని నివారించి, త్రిదండాన్ని ధరించి, ముల్లోకాలు కీర్తించేట్లు వేంచేసి ఉండే స్వామీ!, హెచ్చరిక!)

## ఆళవందార్ సన్నిధినుండి తిరిగి ఆస్థానానికి వచ్చేటప్పుడు:

**35) శ్రీమత్కృపామాత్రప్రసన్న! దేవా! హెచ్చరికై! స్వామి! హెచ్చరికై!**

(శ్రీకృపామాత్ర ప్రసన్నాచార్యా!, స్వామీ!, హెచ్చరిక!)



## స్వామి సన్నిధిలో బంగారు మండపం వైపు తిరిగి:

**36) అప్పనుక్కు చ్చంగాళ్షి అళిత్తుకందిట్ట దేవా! హెచ్చరికై! స్వామి! హెచ్చరికై!**

(శ్రీవేంకటేశ్వరునకు శంఖ, చక్రాలను సమర్పించి, ఆనందించిన స్వామీ!, హెచ్చరిక!)

## ఉదయ కాలంలో తాయార్ సన్నిధిలో:

**37) మాలుడనే వేంగడక్కోన్ మార్బుత్తైయుమ్ మామలర్ మేల్ మంగైయై ప్పెఱ్ఱళిత్త దేవా! హెచ్చరికై! స్వామి! హెచ్చరికై!**

(ప్రేమతో శ్రీవేంకటేశ్వరుని హృదయంపై సదా వేంచేసి ఉండే పద్మావతిదేవిని కుమార్తెగా పొందిన స్వామీ!, హెచ్చరిక!)

**38) శ్రీవేంకటశ్వశురాభిధానా! హెచ్చరికై! స్వామి! హెచ్చరికై!**

(శ్రీవేంకటేశ్వరునకు పద్మావతి దేవిని కన్యా దానం చేసి, 'మామగారు' అనే పేరును పొందిన స్వామీ!, హెచ్చరిక!)

## ప్రాతఃకాలంలో చక్రవర్తి తిరుమగన్ సన్నిధిలో:

**39) శ్రీమల్లక్ష్మణ యోగి సార్వభౌమా! హెచ్చరికై! స్వామి! హెచ్చరికై!**

(శ్రీలక్ష్మణ యోగిసార్వభౌమా!, హెచ్చరిక!)

